వాసనలకు పశువులలోవలెనే సంతృప్తి ఆవశ్యకము. కాని పశువులలో ఉన్నట్లు తిన్నగా తృప్తి కలుగుట అసంభవము. కొన్ని కొన్ని చోట్ల తిన్నగాను, సులువుగాను తృప్తి పొందుట శక్యమైనపుడు జీవనము సుఖముగా ఉంటుంది. నాగరక సంఘములలో నివసిస్తున్న ఈ ఆధ్యాత్మికాదర్శములకు ముందంజవేసే మనుజునికి అట్టి పశు సౌఖ్యము అరుదు. కాబట్టి మనుజుని ఉత్కృష్టతకు ఏది కారణమో అదే ఈ వాసనాబుద్ధుల వైరుధ్యమునకు కారణమైనది. ఈ వైరుధ్యమును సాధించుటకు గల మార్గములు మూడు. పూర్తిగా వాసనలకు లొంగిపోవుట; ఇది అంగీకారముకాని పని. వాసనలకు అతీతుడగుట; ఇది ఇద్దరిముగ్గురి దివ్యపురుషులకో తప్ప ఇతరులకు సాధ్యపడని పని. మూడో మార్గము రాజీమార్గము. వాసనల సంగతి, వాటి స్వభావము, ప్రవృత్తులను, వాటి అల్పోత్కృష్ట నిర్మాణములను, వాటి పరస్పర సంబంధాలను బాగా తెలుసుకోవలెను. వాటిని ఆత్మజ్ఞానముచేతను, బుద్ధి విశేషముచేతను చక్కపరచి, నిర్మాణములను పరస్పరము పోరాటము లేకుండ పొందుపరచి వ్యక్తులు ప్రవర్తింపడ మొక్కటే సాధ్యమైన పని. అందుకు ఉపాయము జ్ఞానమే. వాటిని తెలుసుకొన్న కొలదీ వాటిని స్వాధీనపరచుకొనుటకు తగిన సాధనాలు కూడా వ్యక్తమవుతూఉంటవి. బాహ్యప్రపంచమందలి భూతశక్తులెట్లు జ్ఞానమూలము మనుజునికి స్వాధీనములైనవో, అట్లే ఈ భయంకర వాసనలు కూడా జ్ఞానశక్తికి వశములై తీరును. అందుకు తార్కాణముగా వివిధావస్థలలో ఉన్న నాగరక జాతులవ్యక్తులు వ్యక్తపరుస్తున్న వాసనల తారతమ్యములు చాలును. అందరికీ స్వతస్సిద్ధముగా తుల్యములైన వాసనలు నాగరకతచే ప్రసక్తమైన బుద్ధిబలమువలన భిన్నరీతుల నిర్మాణములను బొంది ఎక్కువతక్కువ పశుబలము కలవిగా కనబడుతున్నవి.

కొందరి అభిప్రాయములో ఈ నాగరకతవలన వాసనలు పశువులలోవలె సాక్షాత్తు తృప్తిని పొందకున్నవనిన్నీ, అందుచేత కలుగుతున్న బాహ్యమైన నిరోధమువల్ల మనో నిర్మాణమునకు చాలా అనారోగ్యము సంక్రమిస్తున్నదనిన్నీ వాదిస్తున్నారు. ఇందులో యథార్థము లేకపోలేదు. ఈచర్చ గతవ్యాసాలలో చేసేయున్నాను. అందుచేత మనుజుడు పశుస్థితికి రావలసినదని తీర్మానించ నక్కరలేదు. వాసనల స్వరూపాన్ని తెలుసుకొని ప్రాథమిక వాసనాశక్తిని కొంతవరకు ఉత్కృష్ట మనోవృత్తుల క్రింద వినియోగపరచ సాధ్యము. బుద్ధిపూర్వకముగా అట్టిమార్పు జరగక ముందే మనస్సు ఆపనిని చేస్తూ ఉంటున్నది. పశువులలో మనశ్శక్తి అంతా వాసనల సాక్షాత్తు తృప్తికొరకే వినియోగ పడుతున్నది. సాంఘిక జీవనానికి అలవాటు పడ్డ మనుజుడు వ్యక్తులమధ్యను, వ్యక్తి సంఘముల మధ్యను ఏర్పాటుచేయవలసిన అన్యోన్యమును పోగొట్టుకొనలేక, వాసనల శక్తిని విరోధపరిహారము చేసుకొంటూ, సాక్షాత్తు తృప్తినుండి మార్చుతూ ప్రవర్తిస్తున్నాడు. సాక్షాత్తు తృప్తిక్రింద వినియోగము పొందక, ఉత్కృష్ట ప్రయోజనములకు మారక, అసహజమైన నిరోధమునకు లేబడే వాసనాశక్తే అనారోగ్యమునకు కారణమవుతున్నది. ఈ చర్చకూడా పూర్వవ్యాసాలలో చేసియున్నాను. కాబట్టి బుద్ధివాసనలకు గల వైరుధ్యమునకు ప్రతీకారము ఒక్కటే:- వాసనల స్వరూపాన్ని చక్కగా యథార్థముగా తెలుసుకొని, ఆత్మజ్ఞానాగ్నిలో పశుగుణములను సానపెట్టి ఆదర్శప్రాయుడైన మనుజుడు విజృంభించగలడు.

---


## శతకమంజరి (భక్తిసంపుటము)

ఆంధ్రగ్రంథమాలలో మొదటి పుస్తకము

ప్రకాశకులు: కాశీనాథుని నాగేశ్వరరావు

ఈపుస్తకంలో వృషాధిపశతకము, సర్వేశ్వరశతకము, దేవకీనందనశతకము, ఒంటిమిట్ట రఘువీరశతకము, నారాయణశతకము, కాళహస్తీశ్వరశతకము, దాశరథిశతకము, రంగశాయి శతకము, రామతారకశతకము, రామచంద్రశతకము అనే పదిశతకాలు ఉన్నవి. ఒక్కొకశతకానికి దానిని విమర్శిస్తూ ప్రకాశకులు వ్రాసిన మంచిపీఠిక ఉంది. చాలా వ్రాతప్రతులతో సరిచూచి వాటిల్లోనుంచి తీసిన పాఠాంతరాలున్ను ఎక్కింపబడినవి.

డిమ్మీసైజు ౩౭౯ పుటలు, మంచికాగితాలు, మేలు బైండు. వెల రు. ౧-౮-౦

ఈ శతకాలు ఒక్కొక్కటీ ప్రత్యేకం దొరకును. ఒక్కొకదాని వెల రు. ౦-౩-౦.

మేనేజరు: ఆంధ్రగ్రంథమాల, 6-7, తంబుశెట్టివీధి, జార్జిటవున్, చెన్నపురి.



రాధా - కృష్ణ

చిత్రకారుడు. నానుబాల - కుమారస్వామిగారు, కళానిలయము, సోంపేట.